# పాంచాలి



'విద్వాన్'
పింజలి సోమశేఖరరావు



ప్రచురణ
సారస్వతనికేతనము
వేటపాలెము.

# పీ ఠి క

## [ ౧ ]

ఆంధ్రప్రదేశమున పలనాటి వీరులను గూర్చినగాథలకు జనసామాన్యములో విశేషవ్యాప్తి కలదు. పలనాటి వీరచరిత్రను మహాభారతముతో పోల్చి, విశిష్టదృష్టితో సమీక్షించి, సమాదరించినవారును కలరు. ఆంధ్రభూమిపై వేయిసంవత్సరముల లోపల జరిగిన యుద్ధములలో పలనాటి వీరుల యుద్ధములకే ప్రాకట్యము మెండు.

రాజకీయ విషయప్రాధాన్య మట్లుండ, శైవవైష్ణవ మతావలంబకుల కా కాలములో విశేష సంఘర్షణము లున్నట్లు ఇతిహాసము వలన తెలియవచ్చుచున్నది. పురుషపుంగవములకు స్త్రీ నాయకత్వ మన్న చిన్నచూపు. ఆ నాళ్ళలో నాయకురాలు అను యువతి మంత్రిత్వము వహించి, రాజునకు గురుస్థానము స్వీకరించి, రాజ్యపాలనము సాగించినది. రెండవపక్షమువారి మంత్రి బ్రహ్మనాయుడు. ఇరుపక్షములవారికిని వైరములు పెరిగినవి. రాయబారములు విఫలమై యుద్ధములు కూడ సంభవించినవి. అనేకులు యుద్ధరంగములలో అసువులు విడిచిరి.

పలనాటి వీరచరిత్రను శ్రీనాథ కవిసార్వభౌముడు ద్విపద కావ్యముగా రచించి నాడనిప్రసిద్ధి. ఆ గ్రంథము శ్రీనాథ విరచితము కా దని కొందరమతము. ఎట్లయినను ఈ ద్విపద కావ్యమే పల్నాటి వీరగాథా నిబంధనములో మొదటిది. దీనిని మాతృకగా స్వీకరించి కొండయ్య, మల్లయ్య అను కవులు ద్విపద

కావ్యము చేసినాడు. ముదిగొండ వీరభద్ర కవి "వీరభాగవత" మను పేర పల్నాటిగాథ పూర్ణముగా రచించినాడు. పిడుకపాటి నరసయ్య కవి "మగువ మాంచాల", "అలరాజు రాయబారము" అను కావ్యములు చేసినాడు. ఎందరో కవులు వీరగాథలలో ఏదో యొకఘట్టమును వస్తువుగా గైకొని, చాల ఖండకృతులు రచించినారు. ఈ విధముగా వీరగాథ ఆంధ్రలోకమున వ్యాపించినది. నాటకములమాట ఇచట ఉద్ఘాటించలేదు.

[ ౨ ]

పింజల సోమశేఖర కవి "మాంచాల" అను ఖండకృతి చేసినాడు. కథాపీఠముగా పూర్వచరిత్రను విస్తరింపక ఈతడు కొలదిగా పలనాటి ప్రాభవమును స్పృశించి, వస్తునిర్దేశము చేసినాడు. మాంచాల భర్త యగు బాలచంద్రుడు బ్రహ్మనాయని పుత్రుడు. అతడు బొంగరా లాడుచుండ వైశ్యాంగన అతని నధిక్షేపించినది. ఆమె నిష్ఠురోక్తులవలన బాలనాయకుడు మాంద్యము విడిచి ప్రబుద్ధుడై, యుద్ధోన్ముఖుడయి, ఆశీర్వాదముకొరకు తొలుత తల్లిసన్నిధికి జనినాడు. ఏకపుత్రువిషయ మగుటచే తల్లి దిగులు పడి, యోచించి, భార్యకడకు పొమ్మని యుపదేశించినది.

బాలనాయకు డొకానొక వేశ్యకు వశంవదుడై చాలకాలము నుండి భార్యముఖము చూచుట మానుకొన్నాడు. అట్టివా డాకస్మికముగా భార్యసన్నిధి కెట్లు చనగలడు? అయినను అతని తల్లి ఐతాంబ ముందుగా అతని యత్తవారింటికి బోయి అచ్చటివారిని సన్నద్ధులను చేసినది. బాలనాయడు అలంకరించుకొని పొట్టేటిపై

నెక్కి అత్తవారింటి కెట్లో చేరినాడు. బహుకాలమునుండి మగని రాక కెదురు చూచుచున్న మాంచాల భర్తకు స్వాగతము పలికి ఉపచారములు చేసినది. ఉబుకుచున్న మోహముతో నత డత్తవారింటనే ఆగిపోనెంచెను. కాని వీరనారి యగు మాంచాల అతనికి క్షాత్రధర్మము బోధించి, భండనమునకు బంపెను. బాలచంద్రుడు రణక్షేత్రమున అభిమన్యునివలె పోరాడి, అసువులు కోలుపోయెను. మాంచాల సహగమనము చేసి, సతి యయ్యెను.

ఈ సందర్భములను మనస్సున నిడుకొని, పింజల సోమశేఖర కవి ఈకావ్యమును రచించినాడు. ఈయనవాక్కు సరళమైనది; శైలి ద్రాక్షవలె మృదుమధురము. పద్యములు సరసముగా జాలువారుచు, అందందు భావపుష్పముల పరిమళమును పరిమితముగా వెదజల్లుచుండును.

ఈకవి సంస్కృతమును సముచితముగ వాడుచు, జాను తెనుగునే విశేషముగా సంతరించినాడు. ఇందు జాతీయములు, లోకోక్తులు, పదబంధములు ప్రస్ఫుటముగా గోచరించుచుండును. ఇందలి వర్ణనలు, సంభాషణలు, సూక్తులు సమంజసముగా నున్నవి. కావ్యము కొలది యయినను, ఉత్తమబోధతో, తాత్పర్యార్థముతో, రసపర్యవసన్న మయినది.

శివానుగ్రహమువలన ఈకవి ఇతోధికముగా ఉత్తమ కావ్యరచన చేయునుగాక.

**సాహితీ సమితి,** **శివశంకర స్వామి**

ఒంగోలు, 27-3-1959.

# నివేదనము

ఈ "మాంఛాలి" కృతి నిర్మాణమునకుఁ బూనుకొని కొన్నాళ్ల క్రిందట కొన్ని పద్యములుమాత్రమే వ్రాసి కారణాంతరాలవల్ల మానితిని. ప్రసంగవశమున నా అసమగ్ర కృతి విషయము విని శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారు నాకెంతయుఁ బ్రోత్సాహకులై కృతి సమాప్తికి నన్నుఁ ద్వరపెట్టుటయేకాక ఉదార పూరుషులు, సారస్వత నికేతన ప్రతిష్ఠాపకులు, కీర్తిశేషులు నగు చుట్టుకూరి వేంకట సుబ్బారాయ శ్రేష్ఠిగారికి స్మృతిచిహ్నముగా అంకితమిమ్మని కోరిరి.

వారి కోరిక నాకన్నివిధముల గలిసి వచ్చినట్లయినది. శ్రేష్ఠిగారు తమ సర్వస్వ మొసఁగి నెలకొల్పిన గ్రంథాలయమున నేను బాలకుఁడనై పొందిన ప్రయోజన మనంతము. వారియుపకృతికిఁ బ్రతికృతిగా నాయీకృతి వారి కీర్తిమూర్తికి మాలాకృతి చేయఁ గల్గితిని.

దీనికింత ప్రేరకులై, కారకులునగు శ్రీనివాసరావు పంతులు గారికి, సారస్వత నికేతన నిర్వాహకులకును కృతజ్ఞుఁడ. కోరినంతన కృతి సమీక్ష సలిపి పీఠిక వ్రాసిపంపిన "మహామహోపాధ్యాయ" శ్రీ శివశంకర స్వామి వారికి నమోవాకములు.

వేటపాలెము,
6-4-1959

ఇట్లు
సోమశేఖర రావు.



విద్వాన్
పింజల సోమశేఖరరావు.

నాదు కవిత్వ పుష్పములు
    నవ్య నవీనము లార్ద్ర మార్దవ
స్వాదు సుధా సుగంధ రస
    బంధురముల్ కయిసేసి మాలగా
నీదగు దివ్యమూర్తి కిదె
    నే నిడుచుంటిని సుబ్బరాయ! ఆ
త్మాదరబుద్ధి అందికొను
    మా కొనుమా సు యశో వికాసముల్.

సుబ్బరాయుల వితరణ స్ఫురణ తోడ
నలరు సారస్వత నికేత నాభిదమగు
నే మహాసంస్థ యు య్యది భూమిమీఁద
నిలుచుగాక! రవీందులు నిలుచుదాఁక.



కీ॥ శే॥ ఊ. వేం. శ్రేష్ఠి గారు.

# పాంచాలి

పలనాఁడు తెలుగు నాటను
గల నాడులలోన నెన్నగలనాడై ఆ
ప్పలనాడు వెలిగ వెలుఁగుల
వెలనాడై తెలుఁగువారి వెలగల నాడై.

౨

కలిమికేలోటు లేదందు బలిమికెందు
దీటు గనరాదు లేమికి జోటులేదు
పల్లెనాడెల్ల నాఁడునుం జెల్లె-ఆంధ్ర
మాతృమస్తక మాణిక్య మకుటమనగ.

౩

పెఱుగుట విఱుగుటకేయని
యెఱిఁగిన వారనెడి మాటయేల వితయగున్
పెఱిగిన పలనాడకటా !
పెఱిగి పగల్ సెగలు పెచ్చుపెఱిగెన్ విఱిగెన్.

౪

ఉప్పెనయును యుద్ధంబును
ముప్పునకే వచ్చుచుండు భువినెందైనన్
తప్పనిసరిగా దైవం
బెప్పటికెది సంఘటించు ఎవ్వడెఱుంగున్,

౫

అన్నదమ్ముల లోని రాజ్యపుఁదగాద
దారితీసెను రక్తపాతమున కపుడు
కౌరవులు పాండవులు మొనల్గట్టి పెట్టి
రూచకోతఁలు భారత యుద్ధమందు.

౬

భారత మహారణంబు ద్వాపరయుగాన
ద్వాదశ శతాబ్దిఁ బలనాటి వారి రణము
సాగిపోయిన వాగిపోఁ జాలవయ్యె
కొసకు ఎవరెంత కాదన్న కూడదన్న.

౭

తెలుఁగురాజని పేర్వడ్డ అలుగురాజు
కొడుకులకట ! నాయకురాలి కుట్రవలన
కంటుబలిసి భ్రాతృత్వంబు మంటఁగలసి
నఱికి కొనినార ఒకరిపై నుఱికి యొకరు.

౮

కోడిపుంజుల రోసాలతోడ నచట
రేగి రోసాలు మీసాలు త్రిప్పినారు
నాగులేటియొడ్డునఁ గదనంబు మొగిసి
వారువీరును కత్తులు నూరినారు.

౯

అట చెలరేగినట్టి సమ
  రాగ్నికి మూలమటంచు నాఁటి కు
క్కుటముల పందెమొక్కటియె
  కూడదు చెప్పికొనంగ; దానికం
తటికిని వెన్కనున్నది మ
  తమ్ముల పేరిటి పాడు నీసదే
కటకట దారితీసినది
  కత్తులవేఁటకు మిత్తిబాటకున్.

౧౦

ఒక్కదెస వీరశైవ మింకొక్కదెసను
వీరవైష్ణవ మొండొండు పెనఁగిపెనఁగి
మండిపోయెను నిప్పులేకుండ నచట
పగిలినవి దానితో అగ్నిపర్వతాలు.

౧౧

ఏమిదురదృష్టమోకాని యీ మతాల
పిచ్చికోపాలతోఁ బోరుదెచ్చికొనిరి
ఎలుకపైఁగలకోపాన ఇంటికెల్ల
చిచ్చునుంబెట్టుకొన్నారు చేతులార.

౧౨

నాయఁడు వీరవైష్ణవుఁడు
నాగమ శైవమతావలంబ- యీ
నాయకురాలివల్ల పల
నాడొకటేమి? మహాంధ్రదేశమే
ఊయెలలూగిపోయినది
ఊగిరియోధులు సాగిరాజివై
పాయెడ నాగులేఁటిదరి
యందునబాఱును నెత్తుటేర్లఁకన్.

౧౩

శాంతి నశించిపోయిన ద
శాంతిపిశాచము గజ్జెగట్టి అ
త్యంతము రాజ్యమేలినది
ఆ పలనాట నిరంకుశంబుగా-

గొంతులుకోసికొంట కొన
  గూడిన యీ రణయజ్ఞమందు ది
గ్దంతులవంటి యోధులకుఁ
  దప్పదు మృత్యువు తప్పదేమనన్.

౧౪

చాపకూటి సిద్ధాంతాలు సాగఁజేసి
అన్నికొలముల వారొకటన్నవాఁడు
కన్నమని మాలనిం బెంచు కొన్నవాఁడు
బ్రహ్మనాయండె పో నాఁడు పల్లెనాట.

౧౫

మాల కన్నమనిం బ్రాలుమాలకుండ
విద్దెలఁ దనంతవానిగా దిద్దినాఁడు
దిద్దుటయుకాదు వానిని బెద్దసేసి
సర్వ సైన్యాధిపత్య మొసంగినాఁడు.

౧౬

దళవాయి మాల కన్నమ
పొలికలనికి ముందె యొక్క మొదలయొసంగెన్
మొలత్రాడుగట్టి నాతఁడు
దళములఁజేరంగ వలయుఁ దప్పక యనుచున్.

౧౭

క్రొత్తగా భార్యవచ్చి క్రొంగ్రొత్తవలపు
కొలుపులోనున్న ప్రాయంపు కోడెకాండ్రు
పోయినారటే కారెమపూడి కపుడు
గెలుపులచ్చిపయిని మరుల్ గీలుకొలిపి.

౧౮

వీరమేడపిలో మగవారియందు
నూఁగుమీసాలవాఁడును నేగె ననికి
బ్రహ్మనాయని కొమరుండు బాలునకును
వీరతాంబూల మీరేమి కారణంబొ?

౧౯

బొంగరా లాడుకొనువాఁడు సంగరాల
కేలయని తుస్సునంబుచ్చిరేమొ వాని
తెలుఁగునాటను మేటి నా వెలుఁగుఁగన్న
బ్రహ్మనాయని కెటువంటివాఁడు పుట్టె.

౨౦

వారస్త్రీభోగైక వి
చారుఁడు సంగ్రామ జయ విచారుండగు తే
తీరున నగునని యేమొ
పూరికిఁగొనరైరి వానిఁబోరికిఁబిలువన్.

౨౧

శీలము వారి కందఱికిఁ
జెన్నయు బాలుఁడొకండె బాలుఁ డి
య్యాలపు వీరయాగమున
నయ్యొకనిన్ బలిపెట్టనేల యం
చాలము సంగతిం దెలుప
రైరొ ? యెఱుంగమి పూఁత పెట్టిరో?
ఆలరి పొందు పాడు వెల
యాంధ్రుర లోకము గ్రుడ్డి లోకమై.

---

# 2

అలవైశ్యాంగన నిష్ఠురోక్తుల శ్రవో
   వ్యాఘాతమై మాంద్యతా
కలితధ్వాంత మలీమసంబెడలె- ఉ
   త్క్రంపించె దేహంబు- పొం
గులువారెం బలనాటిబాలకునకుఞ్
   గ్రొవ్వేడిరక్తంబు- ప్ర
జ్వలనంబందె హృదంతరాళమున రో
   షజ్వాలికామాలికల్.

౨

ఆంధ్రశ్రీ తులకించిపోయినది- స
   ర్వాశావధుల్మెట్టి నీ
రంధ్రఖ్యాతులు గొండ్లిసేసినవి- వీ
   రశ్రీ సముమ్మేషమై
యాంధ్రేయంబగు పౌరుషంబపుడు రా
   పాడెఞ్- త్రికాలంబులం
దాంధ్రానీకము సంస్మరించుకొననౌ
   అన్నమ్మ పున్నెమ్మిలఞ్.

౩

"నీవారల్ పగవారిఁజంపఁ జనఁగా
నీవిక్క డాడంగులన్
జావంగొట్టఁగ నుంటివా పిఱికిపం
దా!" యన్న నిందాపదం
బే విన్పించెఁ బ్రతిధ్వనించుచుఁజెవిన్
విశ్వాంతరాళమ్ములో :
భావస్పందన మందినాఁడతఁడు స్త
బ్ధత్వమ్ము వమ్మెచనన్.

౪

తిరిగినదివానితల వెన్నుదిరిగి చూచు
కొన్నవాఁడప్పు తలగోకి కొన్నవాఁడు-
ఇంకనుంజిన్నవాఁడనా యే నటంచు
పెఱిగి యావేశమొకమాఱు పెఱిగినాఁడు.

౫

నిద్రాఖంబగు వాని మానసములో
నిండారు దౌర్బల్యమున్
నిద్రంబొందినయట్లు ముచ్చముడిగెన్
నిర్లేపుఁడై నాఁడు- ని

ర్నిద్రుండయ్యెను- కన్నువిప్పఁగనియెన్-
నిక్కించి నెమ్మే నదే
ఉద్రేకంబున నూగినాఁడు సమరో
ద్యోగంబు యోగంబుగాన్.

౬

విడఁబడె వానిలోఁ బడుగు
పేకల నల్లిన కాఱుచీఁకటుల్
పెడఁబడి యింతకాలమిటు
వీఱిడి మూఁకల తోడఁగూడి నా
సడవడిఁ బాడుచేసికొని
నాఁడగదా యని యెంతయెంతయో
తడఁబడినాఁడు ఘోర పరి
తాప మహాపరిపీడతాత్ముఁడై.

౭

పశ్చాత్తాపము కాల్చివేసినది యా
పాదంబుగా వానిని-
నిశ్చేష్టుండయి నిల్చినాఁడటులనే
నిత్వోల్ల నీర్గార- స

ద్యశ్చైతన్యముచేత వాని కపు డా
త్మకాళనంబయ్యెనో
ఆశ్చర్యంబుగ మాఱినాఁడు రణవి
ద్యారేఖ రేకెత్తఁగన్.

౧౮

బొంగర మాడుకొంచు వెడ
మూఁకలతోఁ దిరుగాడు నాతఁ డు
ప్పొంగిన వెచ్చనెత్తురుల
పొంగుల తో గమియించు వాఁడటే
సంగరరంగభూములకుఁ;
చాలవిచిత్రము! చాలమార్పు! వై
శ్యాంగన మూలమింతటికి
ఆమెవవస్సున ఏమియున్నదో!

౧౯

అన్నమ యేమియున్నదొ? మ
హత్తరశక్తి యొకండు దానిలో
నున్నది - లేకయున్న ఇటు
లుత్త బిటారపు పచ్చి ప్రోచికో

లన్న రణాలకేగ దగు
నట్టిఁడె? ఈతనిరేక యిప్పుడీ
యన్నువరూపు దాల్చినది
ఐతమచేసిన పూజయెట్టిదో?

౧౦

ఒట్టిడినట్లు తిట్టది ర
ణోన్ముఖునింబొనరించి బాలునిన్
నెట్టెను శాంతిఘాతుకుల
నిల్వున గుత్తుకలూడ్చి గుట్టలం
బెట్టుమటంచు ముందునకు;
వీరుల కాంధ్రులకామె తిట్టునన్
గుట్టునెఱింగి దేవతగఁ
గొల్చిన ఆయమ అప్పుతీరునా?

౧౧

ఆమెయె లేకయున్న అయి
తమ్మ కుమారుని ఘోర వీర సం
గ్రామ కథావిధాన మది
కల్గద యాంధ్రచరిత్ర; కామె వా

చా మహిమంబు సుప్తనర
　జాతికిఁ జక్కని మేలుకొల్పుగా
శ్రీమహితాంధ్రలో వినఁగఁ
　జెల్లును పెల్లు ప్రభాతవేళలన్.

౧౨

నిందాజల్పిత మది యొక
మందుగఁ బనిచేసె వాని మాంచ్యమ్ముపయిన్
క్రందుకొనె జాతికీర్తులు
అందుకొనెన్ వాఁడు పౌరుషాంచిత సరణుల్.

౧౩

నాయనిబిడ్డ వాఁడు పలి
　నాటి భవిష్యము వానితోఁడిదే
పోయె నెకాయెకిన్ జనని
　ముందటికిన్ "రణభూమికేగఁగా
నీయుము తల్లి! నాకు సెల
　వి' మ్మన గుండె గుభేలుమన్న ద
ప్తా యయితమ్మకున్ గొడుకు
　నాలపుటూసున నేమిసెప్పుదున్.

౧౮

కొలమున కొక్కఁడే కొడుకు
కోరినకోర్కులు- నోచినట్టి నో
ములు ఫలియించి వీఁడొకఁడు
పుట్టెను నా; కొకగాని యొక్క యీ
నలుసునుగూడ మిత్తికిడ
నా? కదనాలకుఁ బంపి- యేమన
న్వాలె- అసిధారపై నడక
వంటివ వీరుల ధర్మ కర్మముల్.

౧౯

పగ్గములూనికట్టి పడ
వైచిన బాలుని పగ్గె మాన్పఁగా
దగ్గది కాదు- వీరులకు
ధర్మము పోరికిముందు భార్యలం
డగ్గరి దీవెనల్గొనుట;
నాసుతుఁడెన్నఁడొ చూచెఁ దొండిలిఁ
సిగ్గుననున్న కోడలిని;
నేఁడుగనన్ మఱచున్ రణంబిఁకఁ.

౧౬

అది యొక పిచ్చియూహయగు
  ఆ యయితమ్మకు- పుత్రమోహ మి
ట్టిదియగునేమొ? కేవల మ
  లీమస మానస- వీరధర్మము౯
మది విడనాడఁ జూచినది
  నాయనిభార్యనుసైత మెట్టి క్రిం
ది దశకుఁ దెచ్చె! ఈ కడుపు
  తీపికిమించిన తీపిలేదొకో?

౧౭

అనుకొన్నదేమొ? తనకుం
దనకోడలు తోడటంచు- తన తనయునితో
ననుచున్నది- ముందటికత
కనకున్నది- ఎంత బేలగానున్నదియో?

౧౮

ఏరా! పోరులకేగుచుంటివిగదా!
  ఏనాడునుంగాని నీ
పోరాముల్గలవొక్క కోడలి; కిటే
  పోయెన్ దినాలన్నియున్

నీరాకల్ నెలరాజు రాకలటులన్
　　బేరాసతోఁ జూచునే
పోరా! నీ ప్రియురాలినింగనఁగఁ గూ
　　ర్మిల్ పేర్మిలింపొందఁగన్.

౧౯

నీ ప్రియురాలి దీవనము
　　నీకిడురా విజయేందిరా విశే
ష ప్రియసంగమంబది; ర
　　స ప్రసరమ్ముగ నా మెచేత నీ
దీప్రనిటాల భాగమున
　　దిద్దిన మేల్తిలకమ్ము వీర రే
ఖా ప్రచురమ్మునై వెలుఁగుఁ
　　గాంచునురా నవవీరశేఖరా!

౨౦

కోడలిమాట యెత్తఁగనె
　　కొంకున మోమటుత్రిప్పెదేలరా?
ఏడుపువచ్చు నీస్థితికి-
　　ఎప్పటిమాటలు! పెండ్లిచూపు లే

నాఁడురయయ్యో? ఈ నడి ది
నాల్ నడియింటనె పుచ్చినావెకా
కోడలి కాపురంబు చెడఁ
గొట్టిరి నీ కెవరేమి చెప్పిరో ?

౨౧

ఏ మొగమేను పెట్టుకొని
యేగెద నక్కడి కన్న శంకయే
నీ మనమందు మిక్కలిగ
నెక్కొనినట్లుగ నున్న ; దైన నే
నే మునుముందుగా నచటి
కేగెద - కోడలు సమ్మతింపఁగా
నామెకుఁ జెప్పికొందు- చను
మా- అనుమానము మాని నీవిఁకన్.

౨౨

తలయూపినాఁడు- తల్లి ము
దలను దలనుదాల్చినాఁడు- తలఁపులు కొండం
తలునై ఐతమ సుతు నౌ
దలమూర్కొనె సంతసంబుదార్కొన నెదలో.

౨౩

దిగులడంగెను నెగులుడిగెను
మొగులుడిగన చందమామ పాలు పాయమ నె
మ్మొగమున వెన్నెల వన్నెల
నగవులు నానావిధాల నాట్యముచేసెన్.

౨౪

అందలమునెక్కి డెందము
కొందలమారంగ ముద్దుఁగోడలిఁజూడన్
ముందఱగాఁ బయనించెను
తొందఱపడు మనసు తన్నుఁ దొందఱపెట్టన్.

# 3

ఉత్సుకత తనకంటె ముం దురవడించి
పరుగులిడి వచ్చెనో యన వచ్చియపుడె
పల్లకీ దిగుచున్నది వాకిలికడ
గండువారాడుపడుచు- ఉత్కంఠపడుచు.

౨

ఎంతకాలమునకుఁ బుట్టి నింటివారి
గడపద్రొక్కుచున్నది! కన్నకొడుకు
మూలమునఁ బొరసందులు పుట్టెనెన్ని?
మొగము సెల్లదా మెకు- అన్నమోము సూడ!

3

అన్నిటిని మ్రింగుకొన్న దా యైతమాంబ
ఎన్నిపాటులు పడియైన కన్నకొడుకుఁ
గడకు బ్రతికించుకొనవలె- కడుపుతీపి
యింతచేయించుచున్నది- ఏమనందు?

౪

మాంచాల దేహమది రో
మాంచాలకుఁ గుదురుకాఁగ హర్మ్యస్థితయై
కాంచినదాయైతమ్మను
కాంచినకలలెల్ల ఫలము గాంచిన లీలన్.

౫

కాంచి- రయంబ రణన్మణి
కాంచికయై మేడమెట్లు గబగబదిగి- హ
ర్షాంచితమతి గతి ప్లుతిగా
అంచద్గతిఁజేరి మందిరాభ్యంతరమున్.

౬

అత్తగారువచ్చి రందలమ్మెక్కి- యం
చమ్మతోడఁజెప్ప నామెవచ్చి
పిలిచిపీఁట వేసి వియ్యాపురాలిని
గూరుచుండు మనియె గుతుకముననుం.

౭

ఇంతకాలమునకు ఏమగపడితివా
వదినె గారికనుచు వరుసలెత్తి
రాక తీరనట్టి రాచఱికములేమి
వచ్చిపడెనొ యనుచు గ్రుచ్చిపలికె.

౯

అపుడురేఖాంబ ఐతమ్మ యాగమనము
నడుగుచును ముద్దుఁగోడలి యందు గాలి
మరలి వచ్చితివా యని మాటమాట
గోడుసెందుచుఁ దనకూఁతు గొడవయెత్తె.

౬

కూఁతు కాపురమును చెడఁగొట్టనెంచి
ఓదువనివార లెవ్వరో నూరిపోసి
వాని లేఁత మనసు గుల్ల పఱచినారు
తగులకున్నె? యేనాఁటికి దానియుసురు.

౧౦

అంత చిన్నవాఁడె అబ్బాయియైనను
చెప్పు మాటలఁబడి చెడినవాఁడు
సాని పడుచుకెందు సమముగా కుండెనో
వచ్చియైన చూడ వచ్చుఁగాదె.?

౧౧

పనసపండువంటి బంగారు నాతల్లిఁ
జెప్పిరఁట కురూపి సీ! యటంచు
వెలఁది! నీ కొమరుఁడు వెఱ్ఱిబాగులవాఁడు
నమ్మినాఁడ యేమి నాయమమ ?

౧౨

కొడుకు చిన్నతనపు దుడుకులోనున్నాఁడు
పెద్దదాన వీవు రద్దిలేక
అతుకు కొనఁగరాదె? ఆయాకు నాయాకు
నేర్పుతోడ - కొంత యోర్పుతోడ.

౧౩

అన్న బ్రహ్మన్న రాజకీయాలలోనె
మునిఁగి తేలుచు నూపిరిపుచ్చుకొనుట
కెడము సాలక యున్నవాఁ డేమనందు?
ఇంటిగొడవలు వాని కిం కెటులపట్టు?

౧౪

కన్నకడుపునాది కానిపోనివి చెవి
కెక్కినపుడు మది కళుక్కుమనదె ?
ఎంతకాకయున్న ఇంతయన్యాయమా ?
చెప్పుమమ్మ ! నీవె చెప్పు వదినె !

౧౫

కూరుచుండబెట్టి కొదువ గిదువలేక
అడిగివైచె - కుండ గడిగినట్లు
మంత్రిగారి భార్య మతి మతిలోలేదు
చిన్నినవ్వుల మొగము చిన్నఁబోయె.

౧౨

బ్రహ్మనాయనిసతి నోట వాకురాక
పెదవు లద్రువంగ నెంతయు బేలుపోయి
ఉమ్మలికమునఁ గన్నులు చెమ్మగిలఁగ
పైటతో నొత్తికొంచును బలికె నపుడు.

౧౩

ఏమి సెప్పుదు వదినె! నే నేమిసేతు?
శతవిధంబులఁజూచితి సాగలేద
ఎన్నటికి నున్నదో ? సామి చెన్నునిదయ
వాఁడె జతగూర్పవలయు నావలనగాదు.

౧౪

ఉన్నగొడ వుండనేయుండ యుద్ధమునకుఁ
బోవలయు ననుచున్నాఁడు పుత్రుఁడిపుడు
పిడుగుపాటుగనున్న దీ వెఱగుపాటు
నాకుఁ దోపకుండె ఏమ నంగవలయు.

౧౫

భార్యదీవెన గొనవచ్చువాఁడు వాఁడు
చిన్నికోడలికిం గొంత చెప్పవలసి
వచ్చితిననంగ రేఖాంబ పనినెపమున
చక్కఁబోయె నభ్యంతర సదనమునకు.

౨౦

శీలమాదేవికోడలు సిగ్గుపడెడి
కోడలిని దగ్గరికిఁ జేర్చుకొని చెదరిన
ముంగురులు కేల సవరించి ముద్దుఁగొనియు
మాటతీపులలో నామెమనసులాగి.

౨౧

ఏమిసెప్పినదో? కోడ లేమి యనెనొ?
పోవుచున్నది ఐతమ్మ ముఖమునందు
నవ్వుతులకించుచున్న, దా నందలక్ష్మి
లాంఛనమ్ము లాయమ్మ నేత్రాంచలములు.

---

# 4

ఆ హిమాంశు శిలావేది కాగ్రమందుఁ
గూరుచుండి చిన్నారి మో మోరచేసి
చెక్కిటను జేయిఁజేర్చి యోజించుకొనుచు
నున్న దేమేమొ? మాంచాల - ఉబుసుపోక.

౨

ఒకనాఁడా? ఒకనెలయా?
ఒకయేడా? ఎంతకాల మువ్మాలికము పెన్
సెకలెత్తిపోవఁ బతి తన్
మొకమెత్తియుఁ జూడకునికి పొందున్ కందున్?

౩

ఉవ్విళ్ళూరిన దామె భర్త కొఱకై
ఉత్కంఠతో దారులం
బువ్వుల్ చల్లి ప్రతీక్ష చేసినది రే
పుల్మాపు; లాశా లతల్

త్రివ్వఁగ, నిస్పృహ నిర్నిరోధమయి కుం
   దింపంగఁ డెందంబు - నా
పువ్వుంబోడి తపించిపోయినది ని
   ష్ఫాల్గ్రక్కు నెమ్మోనితో.

౪

తీవెకుఁ బూవు - పూవునకుఁ
   దీవె పరస్పరముం గళాత్మక
శ్రీ విలసిల్లఁజేయు - అవి
   చేడ్పడి వేర్పడెనేని శూన్యముల్
పూవును దీవె లెట్లటులఁ
   బొందికతోఁ గనువిందు సేయుచుఁగ
జీవిత నవ్యసౌరభ వి
   శేషముఁ గాంతురుగా సతీపతుల్.

౫

సతిపతు లొకటైయుండిన
క్షితితలమున నదియె స్వర్గసీమగ నుండుఁగ
సతిపతు లెడపెడ యైనను
బ్రతుకులు బండలుగ నగును పలుకులికేలా?

౬

అడియాసల మాంచాలకు?
పొడగనఁబడునా యెడారి భూమిస్థలిలో
ఎడనెడ జలాశయంబులు?
ఒడయఁడు వేంచేయునా? శుభోదయమగునా?

౭

ఆశ యొకప్పుడు పొడమ ని
రాశ పొడము నింకొకప్పు; డాయమ హృదయా
కాశమ్మున విద్యుత్సం
కాశము లవి పుట్టి యడఁగు గడియ గడియకున్.

౮

ఊహా తరంగ మాలల
నా హేలావతి మరాళ మయ్యెను నిస్సం
దేహము సందేహమ్మును
నో హరి సాహరిగఁదోఁచు నూఁచుమనంబున్.

౯.

పెల్లుబికివచ్చు భావాల వెల్లువలకు
అల్లకలోలమగుచుండె నుల్లమెల్ల
అత్తమాటలు కావుగా ఉత్తమాట
లనుచుఁ దలపోసికొనుచున్న దామె యేమొ?

౧౦

ఏండ్లు గతించె - పూండ్లు గతి
  యించెను - పీటలమీఁద నెన్నఁడో
పెండ్లితఱిన్ బరస్పరము
  వీక్షణ మాలలు నల్లకల్వ పూ
చెండ్లుగగుచ్చి యాడితిమి
  సిగ్గది నన్నుఁ దలెత్తనీయ; దా
పెండ్లికుమారు బోల్చుకొన
  వీలగునో? మఱి కాదొ? నాకహో!

౧౧

పున్నమరేలెటో కడచి
  పోయెడి వీ బ్రతుకుం దినాలలోఁ
దిన్నఁగఁ దిన్నఁగా మునుపు;
  తీఱని యీ వెరవేకి పెచ్చునన్
గన్నులు మూఁతలుంబడవు
  గా నిదురింపగ; కోడితోడనే
నిన్నటిదాఁక వేఁగితిని
  నేఁడు ఫలించున? నా యదృష్టముల్.

౧౨

నెలరాయుని రాకలకై
కలువచెలి అమాసరేలు గడపునటుల నా
వలరాయుని రాకలకై
వలవంతలఁ గడపుచుంటి ఫలమేమగునో?

౧౩

మ్రోఁగదు నా మనో మధుర
మోహన వల్లకి యిన్నినాళ్ళుగా
మూఁగతనాన; నా బ్రతుకు
ప్రొద్దులలో నవజీవనంబిదే
తీఁగలుసాగ - రాగములు
తీయని నా యనురాగమందు సం
యోగముచేసి పాడుకొను
యోగము నా కిఁకనైన పట్టునా?

౧౪

అడవినిబడ్డ మల్లె - అళి
యంటని సంపఁగిపూవునుఙ - శుభం
బెడలిన శూన్యగేహమున
కెత్తిన దీపిక నేను నొక్కతై

గడపితి మాశ కింత యువ
కాశములేని విరక్తి జీవితం;
బెడరు తొలంగి నాదగు న
దృష్టము నేఁడొకరూపు తాల్చునా?

౧౪

నాదు కలల్ ఫలించునొకొ?
నా కగుపించునె యెండమావిలో
స్వాదు సుధాంబు పూరములు?
జన్మములో నిఁక నాకు భర్తకుఁ
లేదనుకొంటి నేఁడయిన
లేమలలోన సమాన గౌరవ
శ్రీ దయివారఁగాఁ దెలుఁగు
సీమను నే నొక వెల్గు గాంతునా?

౧౫

తలపోఁతల్ కొలపోఁతలొంద నుడికం
దఁరాని యానంద డో
లలలో మిన్నులు తాకుచున్నయది - ని
ర్వ్యాఘ్రాప వారాశి లో

పలి కేతాముల నెత్తికొన్నది రస
    వ్యాలోలవల్లీమత
ల్లిలకుం బందిలి కట్టుకొన్నయది కో
    రుకాల్ పూవులై పూయుఁగన్.

౧౨

ముదితకు శుభసూచకముగ
నదరెను నయనాంస చూచుకాద్యవయవముల్
చెదరెను తమస్సు స్తిమితము
కుదిరెన్ నెమ్మనమునందుఁ గౌతుకము కదిరెన్

౧౩

అది నిజంబుగా మధుర సాయంసమయము
నాఁటి యామె జీవిత నభోంగణమునందుఁ
జంద్రుఁడుదయించుఁ దా బాలచంద్రుఁడగుచు
అప్పుడామె చకోరియే తప్పకగును.

౧౪

అందము దిద్దికొన్నయది
    ఆసలతోఁ బెనవేసికొన్నదై
డెందము; చందనాదులు వి
    లేపనచేసి, కడాని జాళువా

పిందెలపేటు నేత్ర వలి
పెంబునుగట్టి, సువర్ణహారముల్
సుందర రత్నహారములు
సొంపును పెంపానరింపఁదాల్చియున్.

౨౦

తీయనికోరికల్ మదిని
దీవెలుసాగఁగ గండువారి య
మ్మాయి ప్రతీక్షచేసినది
మానని వేడుక భర్త రాకకై;
ఆయమచూపు లైనయవి
ఐతమబాలుఁడు వచ్చుత్రోవకున్
దోయజ కైరవావళుల
తో రచియించిన తోరణాలుగా.

5

గిట్టల్ చప్పుడు ఘంటికా ఘుళఘుళత్
   క్రేంకారముల్ విన్నడెః
పొట్టేలెక్కియు వచ్చు బాలుఁ; డదియే
   మోకాని యా వాలకం
బట్టేచూడఁగ గండువారి యిలు దా
   పైనంత వెన్నాడు చు
న్నట్టుల్ తోఁచెను - బిగ్గఁబట్టికొని నాఁ
   డాయేమి పగ్గంబులః?

౨

అడుగులుముడివడి నటువలె
వడిపడి నడుగిడఁగ నుడుగు వడిచెడిన నడః
బెడఁబడుటలుఁ దడఁబడుటలు
పొడగనఁబడుచుండ వచ్చు పొట్టేలదిగో!

3

కటము లదరంగఁ గశఁగొని
చెటచెట లాడించినాఁడు చెన్నయబాలుం
డటుపయి నుదుటునఁ దనఖుర
పుటములు ఘట్టించెఁబుడమి పుటపుటమనఁగః.

౪

ఖురపుట సంఘట్టనములఁ
బరాగ పటలంబు రేఁగి పర్వికొనంగా
ఉరవడిలోని విశేషము
పరిస్ఫుటము గావ చూచువారికి భళిరా!

౫

కనుమూసి తెఱచులోపలఁ
గనులకు మిఱుమిట్లుగొలుపు గమనోద్వేగం
బున మేషం బా మాంచా
ల నివేశము ముందుగా నిలంబడియుండెన్.

౬

దిగుచున్నాఁడదె వాహనంబును - పుర
 స్త్రీలందఱుం జూడ రా
నగుచున్నాఁడు - పదంబు ముందున కిడం
 గాఁ బోవుచో వెన్కముం
దగుచున్నాఁడు - కృతాపరాధుఁ డనుమా
 నావస్థ కీరీతి లో
నగుచున్నాఁడు వృథావ్యథా వ్యథిత శం
 కాతంక పంకాత్ముఁడై.

౭

పచ్చలు తాపినట్టి పిడి
   బాకొకటున్నది వాని కాసెలో
అచ్చపు వీరరేఖ యెసఁ
   లారెడు ఆ కటిపార్శ్వమందునన్
మెచ్చులు గుల్కు వాలదిగొ!
   మేలిమి బంగరుడాలు డాలదే!
హెచ్చిన వెల్మపౌరుష మ
   దే! కనుపించును మీసకట్టులో.

౮

ఆ జులపాలజుట్టు వద
   నాబ్జముపై ముసిముట్టు తేంట్లుగా
మోజునుగొల్పుచున్న యది
   మోమున మూఁగుచు గాలికూఁగుచున్
ఆ జతనాలఁదీర్చిన యొ
   యారపు దోవతి తీరు- చల్వ జు
బ్బా- జలతారు పేటు వలె
   వాటు మగంటిమిఁజాటు నద్దిరా!

౯

రవల చెప్పులజోడు కాళ్ళ మెఱయంగ
నడచివచ్చుచుండెను బాలనాయఁ డదిగొ!
వాని వైఖరిఁగన జయశ్రీ నిజముగ
వలచి నడచివచ్చు నటుండె వానికడకు.

౧౦

గంధువారియి ల్లదె! వేడ్క నిండువారి
వారి యల్లుఁ డిన్నాళ్ళకు వారియింటఁ
గాలుపెట్టుచున్నాఁ; డిటు బాలురాక
పసుపు పారాణినాఁడును కొసకు నేఁడు.

౧౧

మేనయల్లుని రాకకు మే నవెల్ల
పులకితంబయి కన్నమ పొంగిపోయె
మురిసిపోయిన దల్లుని ముద్దులాని
రాక రేఖాంబ మురిపెంపు రేకయుగఁచు.

౧౨

పతిరాకతెలిసి యభ్యు
ద్గతయై మాంచాల యెదురుగాఁబోయిన; దా
సతిపతు లెదు లెదు రైనపు
డతి మధురానుభవ మద్ది యుందదు నుడికిన్.

౧౩

అన్యో న్యాలోకనముల
అన్యోన్యదరస్మితముల అయ్యాలు మగల్
అన్యో న్యానంద రసో
దన్యత్వముతోడఁ గనిరి ధన్యత్వంబుౝ.

౧౪

ఒకరుచూచెడు నవ్వ డింకొకరు చూడ
కొకరి మఱపించి యొక్కరు - ఒకరినొకరు
చూచుకొనుచుండఁగా వారిచూపు లపుడు
తూపులుగ నైన యవి పూవుతూపుదొరకు.

౧౫

పులుకు పులుకునఁ జూచుచుఁ బువ్వుఁబోఁడి
నిలువఁబడిపోయినది కొన్ని నిముసములుగ
ఎంతచూచినఁ దృప్తి జనింపదేమొ?
చూచుచున్నది చూపులోఁ జూపుఁగలిపి.

౧౬

పండినవోయి! ఆయమ త
పస్సులు - నోచిన నోములన్నియుౝ
నిండినవోయి! చెన్నునికి
నిక్కపు బత్తినిఁజేయు పూజలౝ

బంధినవోయి! ఆ మధుర
　　భావపరంపరలోనఁ గాంచె నా
యంతజ్ఞాన హర్ష పుల
　　కాంకురముల్ రస దోహలంబుగన్.

౧౭

ఎన్నడు పెండ్లిసేసికొనె?
　　ఎప్పటిమాటలు? బాలుఁ డీదినా
లన్నియుఁ బిచ్చివేసముల
　　నాఱడిపుచ్చెనుకాన నిప్పు డా
యున్నమితాంగి రూప మది
　　యుజ్జ్వలమై కనుపట్టుచున్నదో?
కన్నులు వేయిచేసికొని
　　కన్గొనుచుండెఁ దదీయరూపమే.

౧౮

కొండొకసేపు కోరికలు
　　కొల్లలుకొల్లలుపోవఁ జూచుకొం
చుండిరి - తీరికల్ తెలియ
　　కుండిరి - వారలచూపు కోపు లాం

దొండునుగూడి ఫుల్ల కమ
లోత్పల పంక్తులు కుప్పలైపడఁ
దండలుగుచ్చి యొండొరులు
తాల్చిరి - పొల్చిరి - నిల్చిరట్టులే.

౧౯

ఆ మయికంబు తేరుకొనె
ఐతమకోడలు - మాయదారి సి
గ్గామె నొకింత ముందు వెనూ
కాడఁగఁజేయుచు బాధపెట్టి లీ
లా మృదు మందహాసము వె
లార్చినదప్పుడు నెమ్మొగమ్ము నం;
దా మధురానుభూతి మఱి
యందునె? నాయనిబిడ్డ జన్మలో.

౨౦

చెలియతెచ్చిన పన్నీటి చెంబుఁగొంచు
ఒడయని పదాలు పళ్ళెమ్ము దిడఁగఁజేసి
కడిగె మాంచాల గాజులు గల్లుమనఁగ
పిల్లవీరుని గుండియల్ జల్లుమనఁగ.

౨౧

మెత్తగా సమర్చిన పూల మెత్త మీఁద
గూరుచుండఁగఁజేసి యా కుట్టివీరు
మగువ యేమఁబోయె నేదియో మాటరాద
బులిసిగ్గులు లోన దోబూఁచులాడ.

౨౨

ఆమెముఖమునఁ దోఁచు మందాక్షరుచులు
మంద మందస్మితములతో మలసి యాడ
బాలచంద్రుఁడు తన పొరపాటు తెలిసి
తప్పుఁడైనాఁడు పెను పరితాపవహ్ని.

౨౩

కమ్మని సంపఁగిన్ విడచి
కంటక సంయుతమౌ గులాబినిన్
జుమ్మనిపోయి ఝూర్కొనెడి
సోమరిపో తల తేటిరాజు మా
ర్గమ్మున నిట్టి యందముల
రాణిఁ ద్యజించి విటాళి భుక్త శే
షమ్ముల కాసపొందితిని
చా! యిది యెట్టి యసంగతంబొకో?

౨౮

గ్రహణ ముడిగిన చంద్రునికరణి బాల
చంద్రుఁడప్పుడు కాంతి నిస్తంద్రుఁడగుచు
వెలఁది మాంచాల రెండుచేతులను తనదు
కేలఁగీలించి ముమ్మునఁ గీలుకొలిపి.

౨౯

నా హృదయేశ్వరీ! సయిఁపు
నా యపరాధము - పిన్ననాఁట ను
ద్వాహము నాడియుం బడుపు
భామల నెయ్యపుఁ దియ్యమందు దు
ర్మోహమునొంది నిన్ భువన
మోహనరూపిణిఁ ద్రోసిపుచ్చితిన్
ద్రోహముసేసితిం బ్రిథమ
దోషము నీవిది త్రోసిపుచ్చుమా.

౩౦

తీయఁగ తీయఁగా వలపు
తీఁపులు తేఁపులు తేఁప సాని స
బ్బాయికి భుక్తముం జలిపి
భామరో! యెంగిలి నీదు పాలుగాఁ

జేయుటయయ్యో, నేరమును
  జేసితి - దీనికి శిక్షగాఁ ద్వదీ
యాయత బాహు పాశముల
  యందున నన్నొనరింపు బందిగా.

౨౭

అని మధురంబుగాఁ బలికి -
  ఆతఁడు కౌఁగిట గ్రుచ్చియెత్తి - మా
రుని తొలిపూజగా నధర
  రోచులు చుబ్బన జుఱ్ఱలాడఁగాఁ
గొనకొనె - నామెయుఁ వలపు
  క్రొంజవులంబడిపోవ నేల యం
చును మది బిగ్గఁబట్టినది
  చొక్కపుఁ బ్రాయము నేమిసేయునో?

౨౮

శీలమ ముద్దుమన్మఁడిటు
  చిత్తము వేగిరపాటు నిల్పుకోఁ
జాలక - యుద్ధమున్మఱచి -
  క్షాత్రపథంబును విస్మరించి - వై

మాలపు సిగ్గున న్మధుర
మంజుగతిం గనుపట్టు ముగ్ధ మాం
చాలఁ గదించె నంగజుని
సంగరకేళి కభంగవేగుఁడై.

౨౯

పతి తమకంబిటున్న యది-
భండనభూముల కేగునప్పు సం
గతి యశుభప్రదంబను టొ
కండది యున్నది - పైన పెచ్చుగా
బ్రతికినయంతకాలమును
భర్త్రనురాగములేక శూన్యతా
స్థితిఁబడి యిప్పు డీ మెఱపు
జీవిత మం దివియేటి భోగముల్?

30

ఆవల భౌతికంబులు మ
హామధురంబులు రాగ భోగముల్
భావము లాగుచున్న యవి -
స్వర్గ సుఖంబులు శాశ్వతంబులై

యీవల సందుబాటునకు
నేర్పడియున్నవి యీ ద్వయంబు నం
దేవి గడించునో జయము
ఏవయి పామె మనంబు మొగ్గునో.

౩౧

భర్త్రాలింగన సంగమాది సుఖముల్
వాంఛించునో? స్వేచ్ఛకై
భర్తన్ త్యాగముచేసి శాశ్వతముగా
స్వర్గాదులందున్ సుఖ
స్ఫూర్తిం గాంచుట కిచ్ఛగింప జనునో?
ముఖ్యంబెదో రెంటిలో
కర్తవ్యంబు నెఱుంగకున్నది వివే
కం బేదగా నత్తఱిన్.

౩౨

నెమ్మది నెమ్మదింపమి చ
నెన్ పన్నిసాకునుజెప్పి - ఇంటిలో
అమ్మను పృచ్ఛచేసె - నపు
డామె యొకించుక యోజ చేసి యు

ద్ధమ్ములకేగునప్డు సుర
తమ్ము నిషిద్ధమటంచు - త్యాగమే
యిమ్మెయి లెస్సయంచు వచి
యించె వివేకపుఁగల్మి పెంపునన్.

33

అరనిముసంబుగూడ అపు
డైనవొ? లేదొ? మనోజవేగనా
తురఁగు బాలచంద్రునకు
దుర్భరమౌచు యుగాల వెన్నియో
తిరిగినయట్టులున్నది - అ
తి త్వరితంబుగ గండువారి కూఁ
తు రరుగుదెంచి ముందు పతి
తుందుడుకుంగని లోన నవ్వుచున్.

34

నా లావణ్యముఁజూచి ముగ్ధుఁడయి సం
గ్రామంపు టూ సెత్తఁ డీ
లీలామాలపు భోగముల్మఱగి స్వ
ర్లోకంబు పోఁ ద్రోయునే?

చాలుంజాలని పూనె - నాతని రణా
  సక్తుండుగాఁజేయ మాం
చాలంబోలు సతీమణుల్ గలరొకో
  సర్వంసహా మండలిన్.

౩౫

మెఱపునుబోలు దేహ మిది
  మృత్తికలోనిద యెప్పుడైన నీ
యతిమఱి దేహమోహమున
  అచ్చపుఁగీర్తులు గోలుపోక - మై
మఱువునుబోలె మార్చుకొని
  మానవదేహము, దివ్యదేహ ము
క్కఱపడి తాల్పఁగాఁ దగును
  కల్గదు చావిఁక దానికెన్నఁడున్.

౩౬

అక్కఱమహాలియుంటిఁ బతి
  కక్కట! నిన్నటిదాఁక - సృక్కితిన్
బొక్కితిఁ బెన్విరాలమున -
  పోరికి దీవెనలంది యీయఁగా

అక్క అయ్యైతి నేఁడు - సుకృ
   తార్థమదింతియ - చాలు నాకిదే
దక్కను తెల్గుదేశమునఁ
   ద్యాగ ఫలమ్ములు వీరభోగముల్.

౩౭

అత్త వచించెనేది అది
   యంతయు స్వార్థముగాఁ గనంబడెఁ
జిత్తము సమ్మతింప దటు
   సేఁతకు - అమ్మ వచించినట్టిదే
మొత్తము మీఁద నుత్తమము
   భూరి యశస్సున క మ్మహా మహో
దాత్తత నాకుఁ జూపినది
   తల్లిని మించినవార లెవ్వరో?

౩౮

ఈ మహారణయజ్ఞాని కెంద ఱెంద
ఱో మహా వీరు లాసల నుజ్జగించి
తీయు తీయని ప్రాణాలు తెగువచేసి
పోవుచున్నారు - పెండ్లికిఁబోవురీతి.

౩౯

వారలందఱునుం బిడ్డ పాపలున్న
వారునుం బ్రియురాండ్రున్నవారు కారొ?
దేశమునకయి వారింత తెగువచేయ
మగువ మాంచాలయే స్వార్థయగుటయేమి?

౪౦

వీరతిలకంబుఁ గొనరాగ విభుని సమర
మునకుఁ బోనీక తుచ్ఛమౌ భోగములకు -
ఆసపడినది మాంచాల యన్న యట్టి
పాడుమాట కే నేల పాల్పడఁగవలయు.

౪౧

ఒక్క నాఁటిమాట ఉండును కలకాల
మీ శరీరము సత మేమికాదు
మాట శాశ్వతంబు మనుజులు శాశ్వత
మా? యటన్నమాట మఱువరాదు.

౪౨

సుతిదప్పుటయే కాదిల
స్మృతియుండప్పెను రణమ్ము సేఁతకు నిపు డే
నతిశయ, వివేకమునఁ బతి
మతిమార్పకయున్నఁ గీర్తి మాయు నిఁకేలా?

౪౩

అని తర్కించి స్వయమ్ముగా - మనసులో
ఆందోళనాభ్రంబు గ
ర్జనముల్సేయగఁ దత్తరంపడుచు రం
జన్మంజు మంజీర ని
స్వన సంశోభితపాదయై కదిసి య
బ్బాలుండు విభ్రాంతుఁడై
తనవంకంగనుచుండఁ బల్కెనది ము
గ్ధ స్నిగ్ధ వాగ్ధోరణిన్.

౪౪

నా పతిదైవమా! సయిపు
నా యపరాధమొకింత, నీదు స్వే
చ్ఛా పరిపూర్తి కర్థ నిమి
షంబును వ్యర్థముసేయరాదు - నే
నోపకకాదు - నీదు నిలు
పోపమి కే నిపుడేమిసేఁతునో
తోఁపగలేదు - నాథ! దరి
దోఁచని నన్నొక దారిఁజేర్పుమా.

౮౫

అని యంతబోక యేదో
యనబోయిన - ఆమె చెక్కుటద్దాలపయిన్
దనమోవి సేర్పఁబోయెను
మనసిజ శరవిద్దుఁ డుచితమార్గము గనునే?

౮౬

ఎత్తిన పెందమిన్ బయి ప
యింబడఁజూచెడు బాలచంద్రు నే
యెత్తునవైన లోఁబఱచి
యాలువు గాచికొనంగనెంచి తా
ముత్తెపుటెత్తు త్రెంచిపడఁ
బోసిన; దా తెగిపడ ముత్తెపున్
మొత్తము లేర్చి కూర్చకయ
ముట్టకుమీ యని యొట్టుపెట్టుచున్.

౮౭

చెదరిన ముత్తియమ్ములను
శీలమ మన్మఁడు కూర్చికొంచు నె
మ్మది త్వరపెట్ట వెండియును
మౌక్తికహారముఁ దీర్చు నంతలో

నుదయుతటంబు వేఁగె నిది
గో! యని యామెకొసంగి హారమున్
బదులుగ ముద్దు లీయు మని
నాఁడు లసద్రసవత్ప్రహాసతో.

౭౧

తమకించి బాలచంద్రుఁడు
గమకించెను ముద్దులాడఁగా మాంచాలన్
సమయమునకు వినిపించెను
సమర ప్రస్థానభేరి సంరోధకమై.

౭౨

కుమ్మరపట్టి దొట్టియనుఁ
గుంజెలికారపుఁ గుఱ్ఱవాండ్రు యు
ద్ధమ్మునకేగ సిద్ధపడి
దర్పమెలర్పఁ బురోప కంతసీ
మమ్మున రోదసీకుహర
భాగము పిచ్చిల యానభేరి రా
వమ్ములు సేయుచుండి, రిట
బాలునిరాకఁ బ్రతీక్ష సేయుచున్.

౫౦

అనుచరబృంద మాహవ స
　మాహితమై యొనరించు భేరికా
ధ్వని చెవిరంధ్రముల్ సెవుడు
　వారఁగఁజేయఁగ - గండువారి నం
దన విషయానువిద్ధమగు
　నాథుని యాత్మరథంబు నాజివై
పునకు మరల్చివేయుటకుఁ
　బూనెను వీర జనోచితంబుగన్.

౫౧

అదిగొ! ప్రస్థానభేరి మ్రోయంగఁజొచ్చె
బాలభానుఁడు ప్రాగ్దిశా భాగమందు
అరుణరుచు లీనుచున్నవాఁ డటులె నీవు
అరులరక్తాన రుచులీన వా? మదీశ!

౫౨

నా ప్రియ! యేల యీ వలపు
　నంబడి వ్యర్థమొనర్తు మోక్ష ల
క్ష్మి పరిణయానుభూతి యది
　చేరువలో గనుపట్టుచున్న దో

యీ! ప్రభుభక్తి కిమ్మెయిని
నిమ్మెయి నర్పణచేయుమెూయి! కీ
ర్తి ప్రదమద్ది శాశ్వతము
దేహికి ఐహికమేల కాల్పనా?

౫౩

మచ్చుతొలంగినట్టు - లను
మానము మానినయట్లు - మైకముల్
విచ్చినయట్టు లవ్వేలఁది
పేరణ లోపల నేమియున్నదో?
అచ్చపుఁ బౌరుషంబు తొలు
కాడినదప్పుడు వీరలోకముల్
పుచ్చికొనంగ మోకరిలి
ముందు శిరంబునువంచి యిట్లనెన్.

౫౪

నను దీవింపవె - నిల్పవే తిలకమున్
నా ఫాలభాగాన, వీ
ర నికాయంబున నాకె గొప్పతనముల్
పాలింపఁగా - ఆంధ్ర భూ

మిని ఐతమ్మ కుమారు కీర్తి వెలుఁగుల్
మీరంగ - మాంచాల నా
ధుని ఖడ్గానికి నుగ్గునూచమయి శ
తుృల్ మ్రగ్గఁగా - నెగ్గఁగా.

౫౫

పెండిలి కేగుచందమున
వేడుకపొందెడు బాలచంద్రునిఁ
నిండు మనంబుతోడఁగని
నిస్తులమౌ తన త్యాగలక్ష్మికిఁ
గుండియలొడ్డి - స్వార్ధమును
గోసి- వ్యయించెను కీర్తి కద్దిరా!
గండుతనాన లేరు ప్రతి
గండుకులీనుల యాడుబిడ్డకుఁ.

౫౬

శిరమువంచిన పతిని చేఁజేతనెత్తి
వీరపత్ని కాఁగోరి యా వెలఁదిమిన్న
వీరలక్ష్మిపదాంకముల్ పేరుకొనుచు
దీవనముసేసె నౌర! ఉద్రేక సరణి.

౫౭

ఉడుకునెత్తుటి పొంగు పెల్లుబికి పాఱ
ఆంధ్రతేజము రా రాపు లందికొనఁగ
మగని మగతనము తనదు తెగువఁదనము
తెలుఁగునేల కాదర్శమై వెలుఁగు లీన.

౫౮

నీ కత్తి కెదురు లేకయె
మూఁకలు మూఁకలుగఁ బగఱమూఁకలు పడఁగా
శ్రీ కమనీయయశస్సులు
నీకే లభియించుగాక! నేఁ డాంధ్రభువిన్.

౫౯

ఏ పాట్లబడి తనకిఁక
నేపట్టునఁ దిరుగులేక యొసకమెసఁగి రా
రాపులువెట్టి యరాతులఁ
గాపులుగావెట్టుగాక! కాలునిపురికిన్.

౬౦

శీలము వారికి నీడగు
శీలముచేఁ గ్రొత్తమెఱుఁగు చేకూర్చితివా
శీలమ్మవ్వయుఁ గనుఁ నీ
శీలమ్మున బోసినోటి చిఱునగవులనే.

౯౧

సన్నిక వీరపత్నిగ నొ
   నర్పుము - చాలది - వీరమాతగా
నెన్నికగాంచు యోగమది
   యెక్కడియోగము? నాకు లేనె లేఁ
దున్న అదృష్టమెల్ల నిది
   యొక్కటి దీని ఫలింపఁజేయుమా
ఉన్నత సన్నుతుల్గనెద
   ఉజ్వలమైన తెలుంగునేలపై.

౯౨

ఐతమ్మ త్త అదృష్టమేమొకొ? విశా
   లాంధ్రావనిఁ వీర వి
ఖ్యాతుల్పొందిన బ్రహ్మనాయనికిఁ దా
   నర్ధాంగియై శాశ్వత
శ్రీతోఁ గాంచెను వీరపత్ని పదవీ
   స్వీకారముఁ; నేఁ డిదే
నీతోఁగాంచును వీరమాతయగు దుస్
   విశ్వోన్నతస్థానముఁ.

౬3

పోయిరమ్మా నాథ! పోయిరావోయి!
పోయితేవోయి! నీ భుజలక్ష్మి భాగ్యాలు.
తెలుఁగుజాతికిఁ గ్రొత్త వెలుఁగు తేఁగదవోయి!
వెలుఁగులో మనవెల్లు వెన్నెల వెలుఁగుగా
వీరపూజలనాఁడు వీరాంధ్రభూమిలో
నారీమణుల్ నీకు నీరాజనాలీయ
పలనాటి మాంచాల పలనాటి బాలుండు
పలనాటి చరితలో నిలిచిపోవలెనోయి!

౬౪

అనుచు బాలునినుదుటిపై తనదు కేల
రక్తకుంకుమ తిలకంబు రహినిదీర్చి
కత్తియొకటిచ్చి పుత్తెంచెఁ గదనమునకు
త్యాగశీల - మాంచాల మా ఆంధ్రబాల.

౬౫

మాంచాల జీవనము రో
మాంచముఁగలిగింప ఐతమాదేవి సుతుం
డంచితగతిఁ పోరునకు గ
మించెన్ దిండ్రించి విక్రమించెన్ మించెన్.

౬౬

అలరాజుఁ బూల విసమిడి
పొలియించిన పాపమతులఁ బొడ వడపక నే
మొలదట్టి విప్పఁబోనని
చలపట్టెం గత్తివట్టి శపథముపట్టెన్.

౬౭

మాయపుఁ గోడిపందెమున
   మాసిరి నంతయుదోచుకొన్న య
న్యాయపథాను వర్తనుల
   నంతకు వీటికిఁ గ్రొత్తకాపులం
జేయక కత్తి దింపనని
   నిప్పులురాలెడి కన్నుదోయితో
ఆ యయితమ్మ పట్టె నుఱు
   మాడెను వైరుల దుర్విచారులన్.

౬౮

బొంగరములాడు నాతఁడు
సంగర రంగమున శత్రుసైన్యముల తలల్
బొంగరములాడె నతని య
భంగ పరాక్రమముసూచి వైరులు బెదరన్.

౧౯

కుప్పన గూరగా నతని
   కొత్తలకుంబడి రెండ ఖండతో
గొప్పలు సెప్పుకొన్న భట
   కోటులు, పేర్చిన దూదికుప్పలో
నిప్పుకణంబువడ్డయటు
   నిప్పులుగ్రక్కెడు వాని కత్తికిన్
కుప్పలు కుప్పలై పడిరి
   కూటువమూక లింకేమి సెప్పుదున్.

౨౦

వాడి కరవాలమున వేరు వాడి కుంజ
రమ్ముపై నరసింగు శిరమ్ము ద్రుంచె
దీనితో వానికంతయుం దీరిపోయె
నేమొ? పోవుచుండెను నాగులేటిదరికి.

౨౧

దూసికొనివచ్చు పెద్దపులిం
ద్రోసికొనుచు లోనికతండు తూలుచుం బడుచున్
జేసినయుద్ధమునకుం దుదిం
జేసికొనం గడిగె రక్తసిక్తాంగాదుల్.

౭౨

అడవులఁ గాలిచి కాలిచి
పాడవాఱిన యగ్నికీల పోలిక రిపులన్
బొడవడచి యడచి యమ్ములు
పుడమిపయిన్నాటి యొఱిగిపోయెన్ బోయెన్.

౭౩

చందురునితోడఁ జంద్రిక
చందంబున భర్తతోడ సహగమనంబున్
బొందెను మాంచాలయును న
మందగతిం బుణ్యలోకమార్గము లందెన్.

౭౪

ఆ యువదంపతులు చిర
స్థాయులు విశ్వమున - ఆంధ్రజనములొసంగున్.
బాయక వారలకుం గమ
నీయ సుమాంజలులతోడ నీరాజనముల్.

---